శ్రీ రస్తు

# నానార్థశివశతక[illegible]

( సటీక ) ఇయ్యద్ది

విద్యార్థుల కత్యంతోపయుక్తంబుగా

శ్రీ గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలూకా రొంపి

చర్ల గ్రామవాస్తవ్యులును నైజాం యిలాకా

సదాశివపేట మిడిల్ స్కూల్

తెనుగు పండితులును నగు.

మాదిరాజు రామకోటీశ్వరకవి శాస్త్రిచే

రచియింపబడి,

బెజవాడ

భవానీ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడెను.

విభవ చైత్రము] 1928 [వెల 0-1-0

శ్రీరస్తు

శ్రీలక్ష్మీవేంకటేశపరబ్రహ్మ [illegible]



# నానార్థశివశతకము



శ్రీగిరిజాప్రియనాథా!
రాగక్రోధాదిదోష ♦ రహితచరిత్రా!
యోగీశ వినుతచరణా!
భోగివలయ రొంపిచర్ల ♦ పురవర
నిలయా!

వ. అవధరింపుము.

తే.గీ. తెనుగుగీర్వాణపదములు ♦ దెలియునటుల
నరసిసమకూర్చి చెప్పితి ♦ నార్యులలర
సిరుల్గొసంగెడి నానార్థ ♦ శివశతకము
దీని భవదంకితమొనర్తు ♦ దేవదేవ!

క. శ్రీయనలక్ష్మియు, గీర్తియు
శ్రీయనవృద్ధియును,బుద్ధి ♦ సిరి, శారదయుఁ
శ్రీయన విష ముపకరణము
శ్రీయన నొకరాగమండ్రు ♦ శ్రీపతివంద్యా ! 1

క. అంకమన గుఱుతు, జోటును
అంకముయొడి, తప్పు, యుద్ధ ♦ మాక్షేపంబుఁ
అంకమన జెంతకర్ధము
అంకముయంకెయును,దోడవు♦నహిరాట్భూషా

క. అంగదయన నుత్సాహము
అంగ దుపద్రవము, గినుక ♦ నాకలియుఁగుఁ
అంగదయన దుఃఖంబగు
అంగదయన గష్టమగును ♦ నంబరకేశా! 3

క. ఆత్మయన బుద్ధి, యత్నము
ఆత్మ శరీరంబు, జీవు ♦ డతులితధైర్యం
బాత్మ యనంగను బ్రహ్మము
ఆత్మయనం మనసు, బన్న ♦ గాధిపహారా! 4

క. ఇమ్మనుకూలము, యుక్తము
ఇమ్మ యుపాయంబు,విరివి♦యింపును, జోటుఁ

ఇమ్ము మనోజ్ఞము, సుఖమును
ఇమ్మనగా స్పష్టమగు, మ ♦ హీధరచాపా! 5

క. ఇరయన జలమును, గల్లును
ఇరయన మేరయును, మాట ♦ పృథివియు మఱియున్
ఇరువుయన బ్రక్క యిల్లగు
ఇరువన స్థానంబు, బ్రక్క ♦ యిభదైత్యహరా! 6

క. ఉత్థానమనగ లేచుట
ఉత్థానము సంతసంబు ♦ యుద్ధము, సేనా
ఉత్థానమనగ ముంగిలి
ఉత్థానంబన సమాప్తి ♦ యురగాభరణా! 7

క. ఊర్మియన నొప్పి, వెల్లువ
ఊర్మి వెలుగు వ్యసనమగును ♦ నుమ్మియు, నలయున్
ఊర్మి షడూర్ములకర్థము
ఊర్మి పరంపరయునగును ♦ యోగీంద్రనుతా! 8

క, ఎగ్గన దోషముకర్థము
ఎగ్గన నపకారమగును ♦ నెగ్గనగీడున్
ఎగ్గు ననాదరమునునగు
ఎగ్గుయనం దూషణంబు ♦ నిందువతంసా! 9

క. ఒఱపన సౌందర్యంబగు
ఒఱపుయుపాయంబు, ధృఢము ♦ యోగ్యతయునగున్
ఒఱపు పరితాపము, తాపము
ఒఱపనగా స్థైర్యమగును ♦ నుగ్రాక్షశివా! 10

క. ఓజయనవిధము, నాజ్ఞయు
ఓజ యుపాధ్యాయుడగును ♦ నుత్సాహమగున్
ఓజ క్రమమును, భయమును
ఓజయనంగ స్వభావ ♦ ముగ్రకపర్ది ! 11

క. కంకుడనఁ గపటబాహుఁడు
కంకుడు కఠినాత్ముఁడైన ♦ కాలుండునగున్
కంకుడనఁ ధర్మరాజగు
కంకుడనం బోయవాఁడు ♦ కాయజదమనా ! 12

క. కందువయన నేకాంతము
కందువ సంకేతభూమి ♦ జాడయు, ఋతువున్
కందువ సామర్థ్యంబును
కందువయన దెగయు, జోటు ♦ కంఠేకాలా! 13

క. కటమన నేనుగు చెక్కిలి
కటమన నతిశయము, చాప ♦ కటమనఁ బీన్గన్

కటము ప్రతిజ్ఞయు, మొలయగు
కటమనగా నొలికిమిట్ట ♦ కంకాళధరా. 14

క. కరణమన వ్రాతకాఁడగు
కరణము కొరముట్టు, మేను ♦ కారణమునగున్
కరణంబన రతిబంధము
కరణంబన బూఁత, పనియు ♦ గౌరీరమణా! 15

క. కరమన నత్యంతంబగు
కరమన వడగల్లు నగును ♦ గరమన జేయిన్
కరమన గిరణము, గప్పము
కరమనగా దొండమగును ♦ గామారాతీ! 16

క. కఱియన నలుపుకునర్థము
కఱియన పశుయోనియగును ♦ కఱియననేర్గన్
కఱియనగ సాక్షి, కోతియు
కరిమేర, నిదర్శనంబు ♦ గామధ్వంసీ ! 17

క. కర్కమన నెండ్రకాయయు
కర్కము సుందరము, గుండ ♦ కర్కమునిప్పున్
కర్కము తెల్లనిగుఱ్ఱము
కర్కంబన నద్దమగును ♦ గందర్పహరా! 18

క. కాలికయన పార్వతియును
కాలిక ద్రౌపదియు, నాడు ♦ కాకియు, గల్లున్
కాలికయన నెలవడ్డియు
కాలిక నూగారు, తమము ♦ గఱకంఠశివా! 1

క. ఖంబన స్వర్గమభావము
ఖంబన నింద్రియము, దెలివి ♦ ఘనపట్టణముల్
ఖంబన నాకాశంబును
ఖంబన వరిమడియు, సుఖము ♦ ఖంజనిభగళా! 20

క॥ గురువన దండ్రి, బృహస్పతి
గురువుయుపాధ్యాయుడన్న ♦ కులపెద్దయుగున్
గురువన తాతయు, మామయు
గురువనగా రాజునగును ♦ గుధరజనాధా! 21

క॥ గోవన నావును, బాణము
గోవన వజ్రాయుధంబు ♦ క్షోణియు, నెద్దున్
గోవనగ శశియు, స్వర్గము
గోవనగిరణంబు, దిక్కు ♦ గుసుమశరారీ! 22

క॥ గోపతియన నాబోతగు
గోపతియన సూర్యుడౌను ♦ క్షోణీధవుడౌ

గోపతియన దేవేంద్రుడు
గోపతియన శంకరుండు ♦ గోవాహశివా! 23

క॥ ఘనమన బెరుగును, సమ్మెట
ఘనమనగాదిటవు, పిడివి ♦ ఘనమనమబ్బున్
ఘనమన తాళపు వాద్యము
కనకాచలచాప! చంద్ర ♦ ఖండకలాపా! 24

క॥ ఘనరసము జలముకర్ధము
ఘనరసమన మజ్జిగగును ♦ గర్పూరంబున్
ఘనరసము చెట్టుబంకగు
ఘనరసమన గుళిగయగును ♦ గౌరీలోలా! 25

క॥ చక్రము కుమ్మరి సారెయు
చక్రము విష్ణాయుధంబు ♦ సైన్యము,గుంపున్
చక్రము రాష్ట్రము, జక్కువ
చక్రంబన బండికల్లు ♦ చంద్రాపీడా! 26

క॥ చక్రియన విష్ణుకర్ధము
చక్రియనం రాజునగును ♦ జక్కవకలరున్
చక్రియనంగను గుమ్మరి
చక్రియనం సర్పమగును ♦ జంద్రార్ధధరా! 27

క॥ చరణమన తినుటకర్థము
చరణము నడవడిక, కులము • చరణము వేఁడన్
చరణమునంగను తిరుగుట
చరణముపాదమును, తిరుణ•చంద్రాభరణా! 28

క॥ ఛాయయన సీడ, కాంతియు
ఛాయయనంగంగు, సూగ్య• సతియుఁ వయుఁన్
ఛాయయన లవము, శోభయు
ఛాయయనంలంచమగును • జంగనాథా! 29

క॥ జల్లియన గొప్పవలయుగు
జల్లియన చామరంబు • సవరము, గుచ్చున్
జల్లియనంగను జాలరు
జల్లియ సత్యంబునగును • జగదాధారా! 30

క॥ డంబన, గపటము, గాంత్రియు,
డంబన గర్వంబు, విధము • డంబంబనగున్
డంబుప్రతిష్ఠకునర్థము
డంబనగానధికమగు, ష • డాననజనకా! 31

క॥ తంత్రియన శబ్దశాస్త్రము
తంత్రియు మర్గమును, సౌష • ధంబును, సేనా

తంత్రము హేతు వుపాయము
తంత్రము నిజరాష్ట్రచింత • తరుణేందుధరా! 32

క॥ తఱియన సమయము కర్గము
తఱియన జేరువయు నగును • తరియనమబ్ధ్
తరియోడ, పోగయు, మథనము
తరియనమూగాని యగును • దర్పకవైరీ! 33

క॥ తలయన శిరమును నెత్తును
తలయన వెంద్రుకలు,గొనయు • తల మొత్తంబుల్
తల యెడ, సమయము, బూనిక
తలయన బత్తమును, జోటు•ధరరాట్చాపా! 34

క॥ తీర్థమన బుణ్యనదియగు
తీర్థముయ జ్ఞంబు, గురువు • దీర్ఘము రేవుల్
తీర్థము శాస్త్ర ముపాయము,
తీర్థము పాత్రంబు,మంత్రి • త్రిదశారిసుతా! 35

క॥ తెగయనని శ్చేషంబగు
తెగవిధము,సమూహ మగును• తెగనిడుపునగల్
తెగయుల్లైత్రాసు, పక్షము
తెగయన మోపెట్టుటగును • త్రిపురపురారీ! 36

క॥ తోయంబన బరివారము
తోయంబొక తడవ,విధము♦దోయము తెగయున్
తోయము జలమున కర్ధము
తోయంబనసమయమగును♦ధూర్జటిసాంబా! 37

క॥ దండమన నమస్కారము
దండము నృపశిక్ష,హాయము♦దండనుజతయున్
దండము బారయు, కవ్వము
దండము కొప్పంబు, గుంపు ♦ దర్పకదమనా! 38

క॥ దండమన దుడ్డుకఱ్ఱగు
దండమ నంచెట్టుబోదె♦దండము వధమున్
దండము కాడయు, గర్వము
దండమనంబీడనంబు♦ దాక్షిణ్యానిధీ! 39

క॥ దండియకిన్నె రకర్ధము
దండియ వీణెయునునగును♦ దంబుఱయునగున్
దండియ పల్లకిబొంగగు
దండియ యనద్రాసుకోల♦దండధరారీ! 40

క॥ దర్శనమన నద్దంబగు
దర్శన మనబుద్ధి, తెలివి ♦ ధర్మము,కలయున్

దర్శనము చూపు, నేత్రము
దర్శనమన శాస్త్రమగు, సుధాకరమకుటా! 41

క॥ ద్రవ్యము మంచిపదార్థము
ద్రవ్యము విత్తడియు, బూత ధనములు, నందుర్
ద్రవ్యమనల క్కకర్థము
ద్రవ్యంబన భవ్యమగును పైత్యారిసఖా! 42

క. ద్విజుడనగ భూసురుండగు
ద్విజు డనగా వైశ్యుడగును ద్విజుడన రాజున్
ద్విజరాజు యనగ గరుడుడు
ద్విజరాజనశశియు, ఫణియు ద్విజరాట్భూషా! 43

క. ధర్మమన నుప నిషత్తును
ధర్మము యజ్ఞం బహింస దానంబునగున్
ధర్మము క్రమ మాచారము
ధర్మము వేదోక్త విధియు ధనదసుమిత్రా! 44

క. ధామమన వెలుగు కర్థము
ధామము చోటును, గృహంబు ధామముకాంతిన్
ధామము మేను, ప్రభావము
ధామంబన పుట్టువగును ధవళాంగ శివా! 45

క. ధేనుక యనఁ నాఁడేనుగు
ధేనుక పార్వతియు, గత్తి ♦ ధేనువుయు నగుఁ
ధేనుక యన నాఁడుగుఱ్ఱము
ధేనుక మనఁ చీరపోతు ♦ ద్వీప చర్మధరా! 46

క. నభమన వర్షాకాలము
నభమనగా తమ్మపడిగ ♦ నాసిక మిన్నుఁ
నభమన దామర తూఁడగు ..
నభమనగా మేఘమగును ♦ నగరాట్చాపా! 47

క. నయమన లాభము, చౌకయు
నయమన సౌందర్యమగును ♦ నయమున నీతిఁ
నయము మృదుత్వము నునుపును
నయమన జూదంబు మేలు ♦ నాగాభరణా! 48

క. నాగమన సత్తు తగరము
నాగంబన పాము, గొండ ♦ నాగము గ్రహముఁ
నాగంబొక నుపవాయువు
నాగముకరి, మబ్బునగును ♦ నగభేది సుతా! 49

క. నారాయణ యన విష్ణువు
నారాయణ రవియు, శశియు ♦ నగజాధిపుఁడుఁ

నారాయణ యన బ్రహ్మయు
నారాయణ యనగ నగ్ని ♦ నగజాధీశా! 50

క. నిష్కమన మాడ, టంకము
నిష్కము పతికమును, పలము ♦ నిష్కము వెండిఁ
నిష్కమనంగ సువర్ణము
నిష్కుటమన తఃబువు, తోఁట ♦ నీలగ్రీవా! 51

క. పటలమన నింటికప్పగు
పటలము తిలకంబు, గ్రంథ ♦ భాగంబు నగుఁ
పటలమన గుంపు కర్ధము
పటలము పరివార మగును ♦ భావజవైరీ! 52

క. పట్టుయన బ్రయత్నించుట
పట్టన నక్కఱయు, బూత ♦ బంధుత్వంబుఁ
పట్టన విషయము, హేతువు
పట్టనగా బట్టుదలయు ♦ బన్నగభూషా! 53

క. పట్టునివాస స్థానము
పట్టవకాశంబు, నూత ♦ పంతంబు నగుఁ
పట్టన ధైర్యము, వెడలుపు
పట్టనగా ఘట్టమగుచు ♦ బాపవిదూరా! 54

క. పణమన వ్యవహారంబగు
పణమన జూదంబు, ధనము ♦ పందెంబు నగున్
పణమన వెలయును, గూలియు
పణమునగా గవ్వయెత్తు ♦ ఫణిరాట్భూషా! 55

క. ప్రణయము ప్రేమము కర్థము
ప్రణయంబన వినయమగును ♦ పరిచయమునగున్
ప్రణయము విశ్వాసంబగు
ప్రణయంబన ప్రార్థనంబు ♦ రజతగిరీశా! 56

క. ప్రత్యయ మన విశ్వాసము
ప్రత్యయ మవకాశ మగును ♦ ప్రఖ్యాతియగున్
ప్రత్యయ మన నాచారము
ప్రత్యయ మన శపథమగును ♦ రాజాభరణా! 57

క. పత్రమన నాకు కర్థము
పత్రము చురకత్తి యగును ♦ వాహనమునగున్
పత్రము దస్తావేజగు
పత్రంబన టెక్క, శరము ♦ పార్వతినాథా! 58

క. పత్రియన కగొండర్థము
పత్రియనం రథికుడగును ♦ బాణంబునగున్

ప్రతియన బక్షి, డేగయు
ప్రతియనం బ్రమానునగును ♦ బ్రమధగణేశా!59

క. పదమన శబ్దము వాక్యము
పదము ప్రయత్నంబు, బద్య ♦ పాదంబునగుఁ
పదమన చిహ్నము, నిరువును
పదమన గిరణంబు మఱియు ♦ పాదంబభవా!60

క. పదనుయన తడికి నర్థము
పదననగా సమయమౌ ను ♦ పరి పాకంబౌ
పదనన వాడికి నొప్పును
పదడుయనం భస్మమగును ♦ బర్వతధన్వీ! 61

క. ప్రభయన ధనదుని పురమగు
ప్రభయన భాస్కరుని భార్య♦పార్వతియునగుఁ
ప్రభయన వెలుగుకు నర్థము
ప్రభయనగా దశయు నగును♦రాకేందుధరా! 62

క. పరికర మన నుపకరణము
పరికరము సమూహ మగును ♦ బరివారంబుఁ
పరికర మన మంచంబగు
పరికరము వివేకమగును ♦ బంచశరారీ! 63

క. పరిఘ మన గడియ౯ప్రాఁ నగు
పరిఘంబన కోటగవను ♦ బాణంబునగు౯
పరిఘము కుండయు, దెబ్బయు
పరిఘంబన నినుప గుదియ ♦ ప్రమథాధిపతీ! 64

క॥ పరియనగను సైన్యంబగు
పరియన పంక్తియును, గుంపు♦బర్యాయంబు౯
పరివేష్టనముకు నర్థము
కరిచర్మాంబర త్రినేత్ర♦ గౌరీమిత్రా! 65

క॥ పక్షమన ఱెక్క, ప్రక్కయు
పక్షము వారద్వయంబు♦ ప్రభునేనుఁగయు౯
పక్షమన శత్రు మిత్రులు
పక్షంబన బలమునగును♦ భవణయహారణా 66

క॥ పాదమన నడుగుకర్థము
పాదము కిరణంబు, వేరు♦ పాతికయునగు౯
పాదమన పద్యపాదము
పాదంబన చిన్నగుట్ట♦ భావజదమనా! 76

క॥ పిండమన నన్నకబళము
పిండము గర్భంబు, జెండు♦ బిందము, బలము౯

పిండంబినుము, శరీరము
పిండముగజ కుంభమగు, గుఁబేరసుమిత్రా! 68

క॥ పెంపన నాధిక్యంబగు
పెంపన పాలన, సమృద్ధిఁ వృద్ధిక్షయముల్
పెంపు మహాత్వము కర్ధము
పెంపనగా గౌరవంబుఁ భీమకపర్ది! 69

క॥ పొదియన భారముకర్ధము
పొదిమంగలియడపమగును పొదుగుయునుఁగున్
పొదియన సమ్మెల పొదియా
పొదియనగా గుంపు, శేషఁ భుజగవిభూషా!70

క॥ పొలమనగ పంటనేలయు
పొలము ప్రదేశంబు, నడవిఁపొలమనయూరుల్
పొలమన జాడయు, విధమును
పొలమనగా గంచెయగునుఁ భుజగాభరణా! 71

క॥ పోటన యుద్ధము కర్ధము
పోటు సముద్రోల్బణంబుఁ బోటన బాడుపుల్
పోటన శౌర్యంబును నగు
పోటనగా బాధయగునుఁ భూతేశహరా! 72

క॥ ప్లవమనగ జువ్విచెట్టగు
ప్లవమనగా నీటికాకి ♦ ప్లవమనగప్వా
ప్లవమన కోతియు, గొఱ్ఱెయు
ప్లవమనగా తెప్పయగును ♦ పావకనేత్రా! 73

క॥ ఫలమన నాగటి కఱ్ఱగు
ఫలము ప్రయోగంబు, పంట ♦ బాణాగ్రంబున్
ఫలమన బంఢుసు లాభము
ఫలమనగా జాజికాయ ♦ ఫాలాక్షశివా! 74

౩॥ బభ్రువనక పిలగోవగు
బభ్రువనం విష్ణువగును ♦ బరమేశ్వరుడా
బభ్రువనంగను నగ్నియు
బభ్రువనం నాకుపచ్చ ♦ బాలేందుధరా 75

క॥ బరియన బార్శ్వము కర్థము
బరిదొంగ దిగంబరంబు ♦ బరిగోలయగున్
బరియనగ శత్రువుండగు
బరిగీచిన గీఱియునగును ♦ భావజదమనా 76

క॥ బలమన నధికము కర్థము
బలమన సైన్యంబు, రసము ♦ బలుపునుదనరున్

బలమన రూపము, గంధము
బలమనగా సత్తువగును♦ భసిత విభూషా 77

క॥ భాసయన వ్రతపుకిర్థము
భాస ప్రమాణంబుగ గును♦ భాషయు మనగన్
భాసన సంకేతంబగు
భాసయునంగను బ్రతిజ్ఞ♦ పాపధ్వంసి! 78

క॥ బీజమన విత్తనంబగు
బీజము వృషణమును, బలము♦విత్తుటయునగున్
బీజమన గారణంబగు
బీజము రేతస్సునగును ♦ భీష్మకపర్ది! 79

క॥ బ్రహ్మయన నలువ, విష్ణువు
బ్రహ్మయనంబుత్విజుండు♦బ్రాహ్మణుడుమఱిన్
బ్రహ్మంబన బరమాత్మగు
బ్రహ్మము వేదంబు, తపము ♦ భస్మవిదారీ! 80

క॥ భగమన ధర్మము, వీర్యము
భగము మహాత్మ్యంబు, యోని♦వైరాగ్యంబున్
భగమైశ్వర్యము, నిచ్ఛయు
భగమన మోక్షంబు, గీర్తి ♦ భైరవజనకా! 81

క॥ భోగమన సుఖము, ధనమగు
భోగము పాలనము, బడగ ♦ భోజనమునగుఁ
భోగియన రాజు, మంగలి
భోగియనం భుజగమౌను ♦ బుష్పశౌరా! 82

క॥ మదమన నేనుగు క్రొవ్వగు
మదమన సంతోషమగును ♦మదమన బోగరుఁ
మదమింద్రియమును, గర్వము
మదమన గస్తూరియగును♦ మన్మథవైరీ! 83

క॥ మధువన ఋతువు వసంతము
మధువనగా చైత్రమగును♦ మఱితేనె యగుఁ
మధువన బాలును గల్లును
మధువనగా నీరు, జంద్ర♦ మఖండధరా! 84

క॥ మండలియన సూర్యుండగు
మండలి శునకంబు, బాము♦ మార్జాలంబుఁ
మండలియనగను రాజగు
మండలియన గుంపునగును♦ మనసిజదమనా 85

క॥ మందుడన తెలివిహీనుడు
మందుడనందిరుగుబోతు ♦ మఱియల్పుడుఁ

మందుడు వ్యాధిగ్రస్తుడు
మందుడు నిర్భాగ్యుడం(డ్రు)♦ మదన విరోధీ! 86

క॥ మాతయన తల్లికర్థము
మాతయనం లక్ష్మియగును ♦ మాతంగియనగ
మాతయనంగను నేలయు
మాతయనంగోవు, భూతి♦ మండితకాయా! 87

క॥ మాధవి పశుసమృద్ధియు
మాధవి తేనెయును, కల్లు♦ మాదీఫలముగ
మాధవియన జక్కెరయగు
మాధవియన లక్ష్మియగును♦ మారధ్వంసీ 88

క॥ మినుకన బంగార్నాణెము
మినుకనగా తాలిబొట్టు ♦ మినుకనవాక్కుగ
మినుకన గాంతియు, గిరణము
మినుకుల నం వేదమంత్రము♦ మేరుశరాసా! 89

క॥ మృగమన జంతువు కర్థము
మృగమనగా నడవియేన్గు♦ మృగశిరయునగు
మృగమన జింకయు, వేడుట
మృగమన్వేషణము, వేట♦ మృత్యువినాశా! 90

క॥ ముఖమనఁగ బంచపాకయు
ముఖము యుపాయంబు, మాట • మొగముఁ గా
ముఖము ప్రయత్నము కర్థము [నోరుఁ గా
ముఖమొక నాటకపుసంధి • మునిజనవినుతా! 91

క॥ మెఱవడియన నతిశయమును
మెఱవడి ధైర్యంబు నగును • మెఱవణియునగుఁ గా
మెఱవడియన నుద్రేకము
మెఱవడి గౌరవము, నేర్పు • మిహికాంశుధరా ! 92

క॥ మేలన శుభ ముపకారము
మేలనబుణ్యంబు, వలపు • మేలన గొప్పా
మేలువిశేషము, లాభము
మేలనఁగా సుకృతమలరు • మీనాంకహరా! 93

క॥ యోగము ధాన్యము కర్థము
యోగ ముపాయంబు, కూర్పు • యోగముమందుఁ గా
యోగము ద్రవ్యము, గవచము
యోగమనంగను బ్రయత్న • మురగవిభూషా! 94

క॥ రచ్చయన రాజమార్గము
రచ్చన మండపము, సభయు • రచ్చన గోష్ఠిఁ గా

రచ్చయన గలకలంబగు
రచ్చయనంగ లహామగును♦ రతిపతిదమనా!95

క॥ రసమన పాదరసంబును
రసమను రాగంబు, విషము♦ ద్రవమును బసరున్
రసమన రుచియును, జలమును
రసమనగా వీర్యమగును♦ రాగవిదూరా! 96

క॥ రహియన సంతోషంబగు
రహియన నాసక్తి, దెలివి ♦ రక్తియునునగున్
రహియన బాగును నర్థము
రహియనగా విధమునగును♦ రాజవతంసా! 97

క॥ రాజనగ రాజ రాజగు
రాజనగా యక్షుడగును♦ రాజన ఱేడున్
రాజన దేవేంద్రుండగు
రాజనగా రాచవాడు ♦ రాజవిభూషా ! 98

క॥ రుచియన సూర్యుని కిరణము
రుచియనగా నిష్టమగును♦ రుచియన జవియున్
రుచియన గాంతికి నర్థము
రుచికడు చల్లని వెలుంగు♦ రుసిజనవినుతా! 99

క॥ లతయన నెక్కుడు తీగగు
లతయన శాఖయును, గస్తురిక॥ లతచీమయగుఁ
లత సాలెపురుగు కర్ధము
లతయన గస్తూరియగుల॥ లాటోగ్రాక్షా! 100

క॥ వగయన సంతాపంబగు
వగయా లోచనయు నగును॥ వగదుఃఖంబుఁ
వగయన విధము, విలాసము
వగయనగా గతియునగును॥ వైశ్రవణసఖా!101

క॥వనమన దోపు నరణ్యము
వనమన బరదేశమందు॥ వాసము, గృహముఁ
వనము సమూహము, జలమును
వనమన సెలయూటయగును॥వ్యాళవతంసా!102

క॥ వర్ణమన నక్షరంబగు
వర్ణము జాతియును, రంగు॥ బంగారంబుఁ
వర్ణము యశముఁ, స్తుతియుఁ
వర్ణమనం గుణమునగును॥ బర్వతశయనా!103

క॥ వలనుయన దిక్కు, పార్శ్వము
వలను యుపాయంబు, విధము॥వలను శకునముఁ

వలను ప్రదక్షిణమును నగు
వలను శుచిత్వంబు, నేస్ప♦వాసవవినుతా! 104

క॥ వశయన భార్యకు నర్థము
వశయన నాడేనుగ గును ♦ వనితయును నగుఁ
వశయన గోవును, గూతురు
వశయనగాలోకువగును ♦ బ్రద్యుమ్నారీ: 105

క॥ వసువుయన ధనముకర్థము
వసువన రత్నమును, నగ్ని ♦ బంగారంబుఁ
వసువన పలుపును, గిరణము
వసువననొకరాజుయగును♦బ్రణవసురూపా!106

క॥ వంశమన గులముకర్థము
వంశము వెన్నెముకయగును ♦ వంశముగుంపుఁ
వంశము బిల్లంగ్రోవియు
వంశంబన వెదురునగును♦ వ్యాళాభరణా! 107

క॥ వారమన కుబ్జవృక్షము
వారము సూర్యాది సప్త♦ వాసరములగుఁ
వారమువాకిలి, గుంపును
వారమనం ౘణము, తడవ ♦ ప్రణతార్తిహరా

క॥ వాసియన తారతమ్యము
వాసిస్వస్థంబు, బాగు ♦ బరిమితియునగున్
వాసిప్రసి ధ్యాధిక్యము
వాసియనం లాభమగును ♦ వనజాక్షుసఖా! 109

క॥ వీడనవదలుట కర్థము
వీడన వర్ధిల్లుటగును ♦ వీడనదండన్
వీడన శిబిరము, గట్నము
వీడన బట్టణము, గుంపు ♦ విశ్వాధిపతీ! 110

క॥ వెంటయనవిధము, మార్గము
వెంటయనంగార్యమగును ♦ వేటయునునగున్
వెంటయన తోడనుండుట
వెంటయనంవిషయమగును♦విషమశరారీ! 111

క॥ వ్యసనము నిష్ఫలయత్నము,
వ్యసనమనం గష్టమగును ♦ బాపమునునగున్
వ్యసన మపాయ మసూయయు, స్త్రీ
వ్యసనంబనగానపేక్ష ♦ హాలహాలాంకా! 112

క॥ శక్త్యుత్సాహము కర్థము
శక్తియనం జిల్లకోల ♦ శర్వాణియునగున్

శక్తివసిష్ఠుని బుత్రుఁడు
శక్తిసహాయంబు, బలము ♦ శర్వాణీశా! 113

క॥ శిఖయన గిరణముకర్థము
శిఖయనగా నెమలిసిగయు♦సిగయుఁ, సెగయుఁ
శిఖయన శాఖయు,నూడయు
శిఖయనగాఁగొనయునగును ♦ శ్రీ విశ్వేశా! 114

క॥ శిఖయన నెమలియు, గోడియు
శిఖికేతుఁగ్రహము, నెద్దు ♦ జెట్టను నగ్నిఁ
శిఖయన బాణముకర్థము
శిఖిసిగ గలవాఁడునగును ♦ శ్రీకంఠశివా ! 115

క॥ శుచియన జ్యేష్ఠాషాఢము
శుచియనగాగ్రీష్మఋతువు♦శుచియనదెలుపుఁ
శుచి శృంగారరసంబును
శుచి పరిశుద్ధంబు నగ్ని ♦ శుభ్రాంశుధరా! 116

క॥ శృంగమున కొండకొమ్మగు
శృంగము ప్రాధాన్యమగును♦శృంగముగురుతుఁ
శృంగము కొమ్ముకనర్థము
శృంగమనం దొంతినంబు ♦ శీతాంశుధరా! 117

క॥ సంగడియన స్నేహంబగు
సంగడియన గుంపు, జతయు ♦ సామీప్యంబుఁ
సంగడి పార్శ్వముకర్థము
సంగడి వెనుకయును,విధము ♦ సర్వాభరణా118

క॥ సంగర మంగీకారము
సంగరమాపదయు, విషము ♦ సమరంబునగుఁ
సంగరమనగ బ్రతిజ్ఞయు
సంగరమన జమ్మి పండు ♦ సారీమిత్రా! 119

క॥ సంజ్ఞయన రవితలోదరి
సంజ్ఞయనం దెలివియగును ♦ సైగయునునగుఁ
సంజ్ఞయనం గాయిత్రియు
సంజ్ఞయనం బేరు, శీత ♦ శైలజనాథా! 120

క॥ సంతతియన గులమగు ధర
సంతతియన వరుసయగును ♦ సంతానమగుఁ
సంతతి పారంపర్యము
సంతతియన వీచియగును ♦ శైలనిశాంతా! 121

క॥ సమయమన బుద్ధి, నాజ్ఞయు
సమయము కాలము, బ్రతిజ్ఞ ♦ సంకేతంబుఁ

సమయము సిద్ధాంతంబగు
సమయంబన శపథమగును♦షణ్ముఖజనకా! 122

క॥ సాధనమన నుపకరణము
సాధన ము యుపాయమగును♦ సాధించుటగున్
సాధనము ధనము, గమనము
సాధనమన మరలబాటు ♦ సైన్యంబీశా! 123

క॥ స్కంధమన చెట్టుబోదెయు .
స్కంధము దేహంబుమఱియు♦సమరంబునగున్
స్కంధము మూపునకర్థము
స్కంధంబన గుంపునగును ♦ గాళీనాథా! 124

క॥ హంసుడన విష్ణుకర్థము
హంసుండన సూర్యుడగును ♦ నభవుండునగున్
హంసుడనంగను జీవుడు
హంసుడనంయోగ్యుడైన♦నధిపుడుసాంబా!125

క॥ హరియన రవిశశికిరణము
హరి సింహము,వజ్రి,కప్ప♦హయమున్,పాముల్
హరియనగ గాలి, విష్ణువు
హరియనగా జిలుక,కోతి♦యముడున్భర్గా! 126

క॥. క్షారమున నుప్పుకర్ధము
క్షారమునం బూడిదయును ♦ గారమునునగుఁ
క్షారము యుమ్మెత్తయునగు
క్షారమునం గాజయగును ♦ కైలాసపతీ! 127

క॥ ఈరమ్యాశతక మిద్ధర
నారూఢిని మిగులఁజెంది ♦ హరిఖరకర భూ
తారకమై తారకమై
తారకమేగాతభక్త ♦ తతులకునభవా! 128

గద్యము.

ఇది శ్రీవేంకటేశ్వరవరప్రసాద లబ్ధకవితావిచిత్ర రా
మభక్త కంచర్లసూర్యనారాయణ కటాక్ష వీక్షా
పాత్రయాజ్ఞవల్క్యశాఖోత్తంస శాండిల్యసగోత్ర
పవిత్ర. మాదిరాజు బుచ్చిరాజ పౌత్ర
సుబ్బమాంబా లక్ష్మీకాంత పుత్ర
సుజనవిధేయ రామకోటీశ్వర
శర్మనామధేయప్రణీతంబైన
నానార్థశివశతము
సంపూర్ణము.

# అర్థము.

పద్యముల సంఖ్య

1. శారద—సరస్వతి.
   ఉపకరణము—కొరముట్టు.
2. తొడవు—ఆభరణము.
8. షడూర్మలు—క్షుత్ తృష్ణా శోక మోహ జరామరణములు
12. కాలుడు—యముడు.
19. తమము—చీకటి.
20. అభావము—లేమి.
22. క్షోణి—భూమి.
   శశి—చంద్రుడు.
23. క్షోణీధవుడు—రాజు
26. జక్కవ—చక్రవాకపక్షి.
29. లవము—కొద్ది, కొంచెము.
30. జాలరు—గొడుగు కొసచుట్టు వ్రేలాడు జల్లి లోనగునది.
32. శబ్దశాస్త్రము—వ్యాకరణశాస్త్రము.
   హేతువు—కారణము.
   నిజరాష్ట్రచింత—తన దేశమును గూర్చినవిచారము

33. చేరువ—సమీపము.

మథనము—త్రచ్చుట.

38. కప్పము—చిన్నరాజు పెద్దరాజునకిచ్చెడు ధనము.

దండు—సేన.

నృపశిక్ష—రాజదండన.

42. భవ్యము—మంచిది.

44. అహింస—ఏజంతువును పీడింపకుండుట.

ఫణి—పాము.

46. ధేనువు—ఆవు.

47. తమ్మపడిగ—తమ్మయుమిసెడిపాత్రము.

మిన్ను—ఆకాశము.

నాశిక—ముక్కు.

50. నగజాధిపుడు—శివుడు.

51. టంకము—పదియారుడబ్బులబంగారునాణెము

పలము—నాలుగుకర్షములయెత్తు.

మాడ—అరవరా.

పతకము—హారమునడుమనుండెడు రత్నపుబిల్ల

సువర్ణము—బంగారము.

54. ఘట్టము—తీరము; గ్రంథమందలి ముఖ్య విషయము.

57. శపథము—ఒట్టు, శపనము.

58. శరము—బాణము.

60. ఇరువు—చోటు.

పణము—ఒకగవ్వయెత్తు.

61. కోటగవను—కోటద్వారము.

65. వేష్టనము—తలగుడ్డ-పాగ.

68. బింబము—గుంపు.

గజకుంభము—ఏనుగమూపురము.

70. మంగలియుడపము—మంగలితిత్తి.

72. సముద్రోల్బణంబు—సముద్రముపొంగుట.

76. బరిగోల—అంకుశము-బాణము.

77. దనరుక—ఒప్పును.

78. సంకేతంబు—ప్రమాణము, ఏర్పాటు.

80. ఋత్విజుండు—యజ్ఞముచేయించువాడు.

81. ఇచ్ఛ—కోరిక.

82. పడగ—పాముపడగ.

భుజగము—పాము.

84. మధువు—వసంతఋతువు.

87 మాతంగి—పార్వతి.

89. ఋనుతులు—వేదము.

90. అన్వేషణము—వెతుకుట.

92. మెఱవణి—ఊరేగింపు.

93. వలపు—కోరిక.

93. అలరుట—ఒప్పును.

95. కలకలము—గుంపునబుట్టిన పెద్దమోత.

96. అనురాగము—ప్రేమ.

101. విలాసము—క్రీడ, చిరునామా.

109. స్వస్థము—నెమ్మదిగానుండుట.

110. శిబిరము—దండువిడియుచోటు.

112. అపాయము—హాని-చెఱుపు.

అసూయ—ఓర్వలేనితనము.

అపేక్ష—ఆసక్తి.

113. శర్వాణి—పార్వతి.

115. అగ్గి—అగ్ని.

సిగ—జుట్టు.

119. సమరము—యుద్ధము.

120. రవితలోదరి—సూర్యునిభార్య.

122. సంకేతము—పేరు.

123. గమనము—పోక లేక నడక.

124. దేహము—మేను.

125. అభవుడు—శివుడు.

అధిపుడు—రాజు.

126. రవి—సూర్యుడు.

వజ్రి—ఇంద్రుడు.

హయము—గుఱ్ఱము

28. హరి—చంద్రుడు, శశి.
ఖరకరుడు—సూర్యుడు.
తతి—సమూహము.

---

మాదిరాజు రామకోటీశ్వరకవి ప్రణీతములు

1 సంస్కృతాంధ్రకవుల చరిత్రము

2 లవకుశ గీతా రామాయణము

(అచ్చులోనున్నవి)

3 నానార్థ శివశతకము (ముద్రితము)

అడ్రస్:—

రొంపిచర్లగ్రామం

నర్సారావుపేట పోస్టు

గుంటూరుజిల్లా.

